## ఈనాటకమునందువచ్చు పాత్రములు.

---

### పురుషులు.

దశరథుఁడు—కోసలదేశాధిపతి.

| | | |
|---|---|---|
| రాముఁడు— | } | దశరథపుత్త్రులు. |
| లక్ష్మణుఁడు— | | |
| విశ్వామిత్రుఁడు— | } | మునులు |
| వశిష్ఠుఁడు— | | |

నారాయణుఁడు—విశ్వామిత్ర శిష్యుఁడు.

శతానందుఁడు—జనకుని పురోహితుఁడు.

శంకరుఁడు—వశిష్ఠశిష్యుఁడు.

జనకుఁడు—మిథిలానగరాధినాథుఁడు.

శతానందుఁడు—జనకునిపురోహితుఁడు.

### స్త్రీలు.

| | | |
|---|---|---|
| కౌసల్య— | } | దదరథునిభార్యలు. |
| సుమిత్ర— | | |
| కైక— | | |

కావేరి—కౌసల్యదాసి.

రుచిర—కైకదాసి

తాటక—రాక్షసాంగన.

సీత—రామునిసతి.

మృదుల—సీతచెలికత్తె.



శ్రీ

# కల్యాణ రాఘవము.

## ప్రస్తావన.

### నాంది.

మ. నవనీలోపమకాయుఁడాబుధుతఁడై ♦ న, న్భూరి శౌర్యంబుతో
సవనంబున్నెఱవేర్చి, గాధిసుతుని ♦ న్సంతుష్టుఁగావించి, శం
భువుచాపంబవలీలఁద్రుంచి, సిరియౌ ♦ భూపుత్త్రిఁగైకొన్నట్టి, రాఁ
ఘవరాముండు, దయాబ్ధిమీకొసఁగుత ♦ న్గల్యాణముల్నిత్యముఁ.

(నాంద్యంతమున సూత్రధారుఁడు తెఱవంకఁజూచి)

సూత్ర—నటీ! ఇటొకసారిరమ్ము.

(ప్రవేశించిన నటిఁజూచి)

ప్రేయసీ! పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు పండ్రెండవ నాటకమొకటి క్రొత్తగా వ్రాసినారు. తత్ప్రదర్శనకార్యమందు నీవునాకు సహాయురాలవగుదువను నాశతో నిన్నిప్పుడు పిలిచితిని.

నటి—అసహాయశూరులకు సాహాయ్యము నిమిత్తమాత్రమైనను నాయందలిదయచే, గౌరవముచేసన్నుఁదోడ్పడుమంటిరి. కాని యానాటకమేదో సెలవిచ్చెదరా?

సూత్ర—

గీ. ప్రథిత రామాయణ గ్రంథ ♦ బాలకాండ
మందలి కథను దెల్పు క ♦ ల్యాణ రాఘ
వంబు నానొప్పు నొక నాట ♦ కంబు కంబు
కంఠి! యిది, సర్వశుభదాయ ♦ కంబు మనకు.

నటి—(నవ్వుచు) ఇచటనా? అచటనా?

సూత్రి—అట్లనెద వేమి?

నటి—ఇచటనేయయిన యెడల, నెన్ని నాటక ప్రదర్శనములు గావించినను గనుబొమలనిోంచి వాసివలెనొక్క రీతిగ నుంటిమి కదా?

సూ—ధనవంతులము గాలేదనియా నన్నుఁ బరిహాసించుచున్నావు?

అ॥ ధనమె సుఖదమంచుఁ ♦ దలఁతు వే, ధనులలో
నతిదరిద్రులంట ♦ నధిక దుఃఖు
లైన వారు గలరు; ♦ కాన సుఖంబునొ
సంగఁ దృప్తికిలను ♦ సాటిలేదు.

న—ప్రశ్నోత్తర సందర్భము బాగుగనున్నది! అటులే యిా "సర్వశుభదాయకము" తృప్తిగావలయునుఁగాని నాటక మెట్లగును?

సూ—నీ ప్రశ్నము గుంటచిక్కులు పెట్టుకొంటవుసుమా!

గీ. జేయచేసర్వసుఖములు ♦ మానవునకుఁ
జేయునొయట్టితృప్తిఁదె ♦ చ్చియిడునీప
విత్రనాటకమ్ముందుచే ♦ వివిధ సౌఖ్య
దాయకంబిదియనవచ్చుఁ ♦ దోయజాక్షి॥

న—సరే! తెలిసినది, లేనివియున్నట్లే తలఁచుకొనిసంతసిం

చుట్టకదా తృప్తి ! అట్టిభావనాజన్య మహానందప్రవాహంబున నోల లాడ్చునాటకముగాన "సర్వశుభప్రద" మంటిరి కాఁబోలు.

సూ—ఓ ! గడుసుదానా ! నన్నెక్కడనుండి యెక్కడకీడ్చు కొనిపోవుచుంటివి ! పావనగ్రంథసంభాషణము భావజానందములో విరమింపఁజేసితివే ! నీవే నన్ను జయించితివి. పోనిమ్ము. ఈప్రపంచ మందాఁడు వారి కోడనివా రెవరు?

గీ. క్రూరనారాచవితతికి, ♦ ఘోరకదన
రవములకు, జంకనట్టివీ ♦ రపురుషుఁడును,
గలికిక్రొవ్వాఁడిచూపుఁదూ ♦ పులకు, జిలుక
పలుకులకుఁబోలిదాసుఁడై ♦ పడునుగాదె !

నటి—మీరుమాత్రమాఁడువారుకారా ? కల్లమీసములతోఁ గట్టుకత్తులతోనుండువా రాఁడువారికోడిరి. దానికేమిగాని, యీశృంగార ప్రసంగమింతటితోఁ గట్టిపెట్టి, కథానాయకుఁడును బతితపావనుండు నగు శ్రీరామచంద్రమూర్తిం గూర్చి యొకింత చెప్పఁ ; డదివిని నాటక ప్రదర్శనమునకుఁ బోయెదను.

సూత్ర—ప్రియురాలా ! మంచిత్రోవకు వచ్చితివి. శ్రీరామ మహిమ యడుగుటకుం జెప్పుటకుఁగూడఁ దగినది. కానిపూర్ణముగఁ దృప్తికరముగ వర్ణింప నా కశక్యము.

గీ. అవనిరక్షింపదయతోడ ♦ నవతరించి
నట్టియాసచ్చిదానంద ♦ మైనతండ్రి,
రామచంద్రుఁడుమనయంత ♦ రంగములకు
లొంగని యమేయుఁడొల్లు ప ♦ ల్కులకులొంగు !

గీ. కానిపూర్వపుణ్య ♦ కర్మ ఫలంబున
ననుభవింపఁ గలిగి ♦ రామహాత్మ
పైనిగల్గు భక్తి ♦ వలన జనించిన
యమృతమంజనా సు ♦ తాదు; లింతి !

మఱియు, నాబహిఃప్రాణమా ! ఒక రహస్యముఁ జెప్పెద వినుము.

సీ. జనకాది బంధు నా ♦ శనవిపన్నాత్ములై
దిక్కులేకేడ్చెడు ♦ దీనులకును
బట్టినదెల్లను ♦ భస్మమైపోయెడు
భగ్నసంకల్ప ని ♦ ర్భాగ్యులకును,
వచియింపరాని దు ♦ ష్పాతకంబులుసల్పి
కుళ్ళికుళ్ళి తపించు ♦ కుజనులకును
జదివినకొలఁదిని ♦ సందేహచిత్తులై
యూఁగులాడువిపశ్చి ♦ దుద్ఘములకు.
ఆవె, నట్టియిట్టివారి ♦ కననేల? నానా, భ
వార్తులైనవారి, ♦ కమృతసౌఖ్య
కాములెల్లరకును ♦ గనకాంగి ! గట్టిగా
నమ్ము ! దిక్కు రామ ♦ నామమొకటె ॥

న—ఔను, నాథా ! ఈయన రామాయణ నాటకములాడు
చోనాకుఁ గాయకష్టములుగూడ నగపడుటలేదు.

సూత్రి—ప్రియురాలా ! అదియొకవింతగాదు.

గీ. మనసునకు దేహంబునకు స ♦ బంధమున్న
యంతదాఁక నెతను బాధ ♦ లంటు నరుల;
భక్తిభరితాత్మ. తనువును ♦ బాసియెపుడు
పోఁబగునో, తనుబాధలు ♦ న్వీడునపుడె.

నటి—ఆహా! ప్రాణేశా ? ఈరామాయణనాటకము లుభయ తారకములుగదా !

సూత్రి—విన్నను నన్నే కాదు. లేఖకపాఠకదృష్టి పరిదర్శ కాదులనందఱఁ దరింపఁజేయ సమర్థములు.

నటి—నిజముగా నేనెంతో ధన్యురాలను.

గీ. దశరథక్ష్మాపతేంద్రుఁడు ♦ తనసతులకుఁ
దెచ్చిపాయస మర్మిలి ♦ నిచ్చినట్లు
నాకుఁ గరుణించి యిడితిరి ♦ నాథ ! యిపుడు
పరమపావనమౌ రామ ♦ భక్తిసుధను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

శ్రీ

# కల్యాణ రాఘవము.

## ప్రథమాంకము.

(ప్రవేశము— దశరథుండు, కౌసల్య, సుమిత్ర, కైక.)

దశ—సతులారా! ఋశ్యశృంగునార్త్విజ్యమునఁజేసిన జన్నము దైవకటాక్షమునఁబూర్తియయినది. ఇదిగో పాయసము. యజ్ఞదేవ దత్త ప్రసాదము. దీనిని మీరు భుజియించి గర్భముల ధరింపుఁడు.

కౌ—మే మందఱము మడుఁగుబట్టలధరించి శుచిగ నున్నారము. తామే మాకొసఁగుఁడు. భుజింతుము.

దశ—కౌసల్యా! ఈపాయసమున నీకెంత కావలయును?

కైక—ఏమైన మధురపదార్థ మితరులకుఁ బంచియిచ్చుచో ముందుగాఁ జిన్నవారికిచ్చుటఁ దీఱుట మంచిపని కావున నాథా! మీరు మాయక్కగారి నొసఁగినప్రశ్నమును నన్నెయొసఁగినయెడల నంతకంటె బాగుగ నుండునేమో?

దశ—కైకా! కేవల రుచిప్రధానమై కడుపు నిండించుకొనుటకుమాత్రమే పనికివచ్చు నైహిక పదార్థమునుబంచిపెట్టునపుడు నీవనినట్లు చేయవచ్చునేమోకాని దైవప్రసాదితమగునీపవిత్రవస్తువును గూర్చి నీవు చెప్పినయేర్పాటు పనికిరాదేమో!

కై—దైవప్రసాదమునకందఱును సమానార్హులే కదా! అట్టిచో పెద్దచిన్న భేదమేల చేయవలయును? కావున ముగ్గురకును సమానముగాఁ బంచిపెట్టుము.

సు—చెల్లెలా! వారి యిష్టానుసారము వారే యాచరింతురు. నీబోధనమేల?

కై—నేను నీకేమియు బోధింపలేదు. నీవు నన్ను మందలింప వలసినపని లేదు.

కౌ—(అపవారించి సుమిత్రతో) చెల్లెలా! నీవూరకుండుము. మనకు భర్తతోఁగాని చెల్లెలితోఁగాని వాదమెందులకు? ఏదైన కటాక్షమునఁ బాయసపాత్రము నాథునకులభించినదో యాదైవకటాక్షముచేతనే యదిమనముగ్గురకు దైవమువిధించిన యేర్పాటు ననుసరించియే సిద్ధించును.

సు—(అపవారించి, కౌసల్యతో) అంతరకంటె భర్తకధికానురాగాస్పదమనినికాఁబోలు నీతివాక్యబోధనమారంభించినది.

కౌ—(అపవారించి సుమిత్రతో) భర్తయందుఁగల చనవున నామె యేమియినఁ బల్కినచో మన మన్యథా యెంచఁదగదు.

కై—నాథా! ఊరకుంటిరేల? ముగ్గురకు మూఁడుసమభాగములుచేసి యిచ్చుటయే న్యాయముకాదని తోఁచినదా యేమి?

దశ—కైకా! అట్లు తోఁచినఁ దప్పుగాదని తోఁచుచున్నది.

కైక—అట్లైన నాకందరకంటె దక్కువనిచ్చెదవా?

సు—చెల్లెలా! ఈపాయసముతో నాఁకలిదీర్చుకొనఁదలఁచితివా? ఇది దైవదత్తమగు పదార్థము. కొంచెము భుజించిననేమి? విశేషముగ భుజించిననేమి? గిండెడు సాలగ్రామతీర్థముఁద్రాఁగిన ఫలమొకయుద్ధరిణెఁడుతీర్థము ద్రాఁగిన ఫలముకంటె నెక్కుడగునా?

కౌ—(అపవారించి) చెల్లెలా! అడుగనిదే నీవేల మాటలాడెదవు?

కై—అక్కా! మీ రిద్దఱు జ్యేష్ఠదేవులు. మీరు పెద్దవంతులు వచ్చినను గదా యను ధైర్యముతో నెన్నిశ్రీరంగనీతులయినఁ జెప్పఁ గలరు. నేను గనీయసురాలను. కనిష్ఠురాలను. అధమురాలను. నీచురాలను. పాపాత్మురాలను. మీ రిద్ద రారగింపఁగా నేదయిన నొక్క యుచ్ఛిష్టబిందువు మిగిలిన నది మీ యుక్ష్ణప్రసాదమని యెంచి కన్నుల కద్దుకొని తినవలసిన దానను.

దశ—కైకేయీ! ఎందులకీకోపము? చూడుము. (చేయి పట్టుకొని) నేనుఁ జెప్పిన మాట వినుము.

కైక—ఒక్క నీవు చెప్పిన మాటల వినుతోడనే నా బ్రదుకు తెల్లవారునా? ఈయక్కగారు చెప్పిన మాట వినవలయును. ఆయక్కగారు చెప్పిన మాట వినవలయును. కనిష్ఠురాలనై నీయింటఁ బ్రవేశించిన దోషమునకు నాకేచిన్నతనము తప్పును? అనురాగములలోఁ జిన్నతనము. ఆదరణములలోఁ జిన్నతనము. ముచ్చటలలోఁ జిన్నతనము. ముడుపులలోఁ జిన్నతనము. మాటలలోఁ జిన్నతనము. మర్యాదలలోఁ జిన్నతనము. బ్రదుకంతలోఁ గూడఁ జిన్నతనము. పరములోఁ గూడఁ జిన్నతనము.

సుమి—(తనలో) కాని చూచు చూపులలోఁ బెద్దతనము. నూడు మాటలలోఁ బెద్దతనము. బుడిబుడియేడుపులలోఁ బెద్దతనము. బూకరింపులలోఁ బెద్దతనము. గయ్యాళితనములలోఁ బెద్దతనము. గడుసుదనములలోఁ బెద్దతనము. కారుమాటలలోఁ బెద్దతనము. కాటులాటలలోఁ బెద్దతనము.

దశ—(అపవారించి) కౌసల్యా! నీ కెంతవంతు కావలయునని యడిగితిని. చెప్పవైతివేమి?

కైక—ఇదిగో ఏ పెద్దల కధికభాగములనిచ్చి యధికులఁ జేసి నన్నన్నివిధములఁ జిన్నసేయఁ దలఁచితివో యట్టి మాయక్కల నె యడుగుము.

దశ—ఏమి? సుమిత్రా! నీయభిప్రాయమేమి?

సుమి—నేను పెద్దనుగాను; చిన్ననుగాను. నడిమిదానను. నన్న డుగనేల?

దశ—సతులారా! మీలోమీరు నిష్కారణముగ వైరమొంద వలదు. నేను సరిగఁ బంచియిచ్చెదను.

కైక—"సరిగ" యనఁగ సమభాగములుగ ననియభిప్రాయ మగునెడలఁ గానిండు.

దశ—సరిగ యనఁగ న్యాయముగ.

కైక—న్యాయమనఁగ నేమి? మీబుద్ధికి న్యాయమా? మా అక్కలబుద్ధికి న్యాయమా? నాబుద్ధికి న్యాయమా? దైవబుద్ధికి న్యాయమా? ఎవరుచెప్పిన న్యాయము? ఏటిన్యాయము? పాయస ప్రదాతయగు యజ్ఞదేవుఁడీ పదార్థమును మామగ్గుర కొసఁగుమని నాఁడా? లేదా?

దశ—అట్లే సెలవిచ్చినాఁడు.

కైక—అంతేకాని బుద్ధిచేత నాలోచించి న్యాయమనితోఁచిన కొత్తన్యాయము ననుసరించి కొందఱను సంతోషపెట్టి కొందఱ నేడ్పించి యిమ్మని యిన్నిమాటలు చెప్పినాఁడా? ఏమి? మాటలాడ రేమి?

దశ—అట్లు సెలవీయలేదు.

కైక—లేనియెడల నింత సందేహమేల? ఈ యోజనములేల? ఈతొట్రుపాటేల? నానోరు కట్టవేయనేల?? మీరన్న న్యాయము

న్యాయముకాదు. పెద్దభార్యకొక్క న్యాయము మాయక్క చెప్పినట్లు నడిమిభార్య కొక్క న్యాయము. చిన్నభార్య కొక్క న్యాయము ... దేవప్రసాదమున కందఱు సమానార్హులను లోకన్యాయము ననుసరించి పంచిపెట్టుము.

దశ — కైకా! బ్రాహ్మణుల కనేకపర్యాయములు నీవుదాన దక్షిణాదుల నిప్పించితివికదా! పెద్దలకు చిన్నల కొకరీతినే యిప్పించితివా?

కైక — బ్రాహ్మణులకిచ్చినదినాసొమ్ము. నాసొమ్మును నా యిష్టానుసారముగఁ బంచియిచ్చెదను. నాయనుగ్రహము ననుసరించి యిచ్చెదను. నీభండారములోని సర్వధనమును మాయక్కలకిచ్చిన నేను నోరెత్తుదునా? నీవు నన్నునిరాకరించి మాయక్కల తోడనే కాలక్షేపముచేసినను నేను దైవమునుదూఱుచు నీపాద ములమొక్కఁబడి యుండుదాననే కాని యిదియేమియని పలుకవలసిన దాననా?

సుమి — (తనలో) అబ్బా! ఏమిశాంతచిత్తత! ఏమిసహనశక్తి! ఇటులే నాథుఁడు చేసిన మొదలయినా సాకేతపురినిసమూలముగానమ్ముద్ర మునగలుపకమానునుకదా? కైక చిన్నతల్లి! నాథుఁడు నీయెడల నత్యను రాగుఁడై మాయెడల నొకకొఱఁతనున్నను మాకు నాథునికిఁ గూడఁ దీవాట్లుతప్ప లేదయ్యెను.

కైక — నీయనుగ్రహమునకు గనఁబడుచుటకు నీయిష్టమును గాపుటకు నీన్యాయమునకు ... సంభావనకు వచ్చిన ముష్టిబాప నయ్యలకువలె మేము నీబంగారముపెట్టలేదే? నీమనుజులఁగోర లేదే? వస్తువేదియును దేవురింపలేదే?

దశ — ఈపరమాన్నము నావస్తువుకాదా?

దశ—కావున నేనొక్కసంగతినిచెప్పెదను. విను ఒక పావు గడియసేపు మీరు సవతులమనుమాట మఱచిపొండు. మీరొక్కతల్లి బిడ్డలనియెంచుకొనుఁడు. అన్యోన్య ప్రేమాధిక్యముకలవారని యను కొనుఁడు. కైకా! ఈపాయసపాత్రము నీచేతికిచ్చెదను. నీవేపంచి యిచ్చుటకు నేనంగీకరించెదను. ఎట్లు పంచియిచ్చెదవో చెప్పుము?

కైక—మేము ముగ్గురము సమముగఁబంచుకొందుము.

దశ—అట్లుచేయుదురేని నీయక్కలయందేమి యాధిక్యమును గనఁబఱచినదానవగుదువు. అదితప్పు. కౌసల్యా! నీవు పంచునెడల నెట్లు చేసెదవు?

కౌ—అందఱకంటెఁ జిన్నచెల్లెలగు కైకకుఁ బెద్దభాగమిచ్చి సుమిత్రకునంతకంటెఁ దక్కువనిచ్చి యంతకంటెఁ దక్కువభాగము నేను దీసికొనెదను.

దశ—సుమిత్రా! నీవు పంచునెడల నెటుచేసెదవు?

సుమి—(నవ్వుచు) నాకేమియునుంచుకొనకుండ నీయిద్దఱకు చెఱియొకసగమిచ్చెదను.

దశ—నీకో!

సుమి—పిదప వారిభాగములలోఁ జెఱియొకసగమును బుచ్చుకొందును. (నవ్వును.)

దశ—ఎంతగడుసుదానవు! సతులారా! ఇదివఱకే వృథగ నాలస్యమయినది. ఇఁక నీపదార్థమును శీఘ్రముగ మీరనుభవింప వలయును. పెద్దభాగముఁ దినినదానికిఁ బెద్దకొడుకునుఁ జిన్నభాగ మును దినినదానికిఁ జిన్నకొడుకును బుట్టునా? కౌసల్య చిన్నభాగము దినినను నామెకుఁబుట్టుకొడుకు పెద్దకొడుకే. కైకా! నీవు పెద్దభాగ మును దినినను నీకుఁబుట్టుకొడుకు చిన్నవాఁడే. అందుచేనీవు పెద్ద

భాగము నేష్టింపఁడగదా అపేక్షించినలాభము నాకు లేదు. కౌసల్య వయస్సుచే మాన్యురా చేతనుఁ బెద్దది. చిరకాలము తపము చేసినది. పుత్త్రులు లేని మాయి పుత్రకంబు నెక్కువకాలము తపించినది. మీయక్క యగుటచే నీకుఁ బూజ్యురాలు. అందున్నై నీయందు నిరంత రానురాగముగలది. ఎన్నఁడును స్వలాభమును గోరుకొనియుండ లేదు. అట్టి యీ కౌసల్యాదేవిని నేను మీరుతప్పక గౌరవింపఁదగినది. మనల లోకంబు మెచ్చును. మనతరువాతివారు మనలఁగొనియాడుదురు. కైకా! మనసులో నేమియుంచుకొనకుము. పవిత్రమైన ముహూర్తము దాటి పోవుచున్నది. అట్లు తలవంచుకొనుట కాదు. నీచేయి నిటు దెమ్ము. కౌసల్యచేయి పట్టుకొనుము.

కైక—(అట్లు చేయును.)

కౌ—చెల్లెలా! నేను వయస్సుచేఁ బెద్దదానవయినను నీవే నాకంటెఁ బెద్దదానవుగ భావించి నిన్ను గౌరవించుచున్నసంగతి నీ వెఱుఁగుదువుకదా! అట్టిచో ననవసరముగ నీబాధయేల? నీయిష్ట మెట్లో యట్లే కానిమ్ము.

కై—నేను దొందరపడి యేమాయిన నిన్ననిన యెడల క్షమింపుము. (కౌసల్యను కౌఁగిలించుకొనును.) అక్కా! సుమిత్రా! నిన్నుఁ గూడ నిట్లే కోరుచున్నాను.

దశ—సెబాస్! కైకా! నీకు కోపమెంత శీఘ్రముగఁ గల్గునో ప్రసన్నతకూడ నంత శీఘ్రముగనే కలుగును. వెఱ్ఱికోపమెటులో వెఱ్ఱిదయయునటులే. ఈపాయసకలశము నీచేతిలో నుంచుకొనుము. ఇదిగో పంచుచుంటిని. కౌసల్యా! నీకు దీనియం దర్ధభాగము.

కౌ—మహాప్రసాదము.

దశ—మిగిలిన యర్ధభాగము రెండుభాగములు చేయుచున్నాను.

(చేసి) ఇదిగో ! ఒకభాగము సుమిత్రా ! నీది. (సుమి॰ గ్రహించును.)

సుమి—మహాప్రసాదము.

దశ—మిగిలిన భాగమును నీవు తీసికొందువా?

కైక—సుమిత్ర నాకంటె పెద్దదయినందుల కామెకు నాకంటె కొంత యధికభాగము కావలదా ?

దశ—అట్లయిన నేమి సేయుమందువు ?

కైక—నావంతు రెండు భాగములు చేసి యొక భాగము సుమిత్రకిమ్ము.

దశ—సెబాస్ ! కైకా ! సుమిత్రా ! నీవనిన్నట్లు నీకు రెండు వంతులు వచ్చినవి. తీసికో. నీకిద్దఱుకొడుకులు గలుగుదురేమో ?

సుమి—(తనలో) ఇద్దఱు పుత్త్రులయిన నేమి ! అనేక శిరస్సులుగలవాఁడయిన నేమి. కొడుకు పుట్టినఁజాలును.

కైక—నేను యష్టమభాగమును తీసికొందును.

దశ—కైకా ! నీవు సంతుష్టినొందితివా ?

కైక—ఆఁ.

దశ—ఉత్తరక్షణమునుండి మనకు ముచ్చటలపై ముచ్చటలు, వేడుకలపై వేడుకలు. పండుగలపైఁ బండుగలు. ఇక్కడకు మనస్సు శాంతి వహించినది. సతులారా ! మీరింక భుజింపరేమి ?

కౌ—ఇక్కడ నేల ? భోజనశాలలోనికిఁబోయి యక్కడ కలిసి భుజింతుము.

దశ—సరే. పోదము రండు.

(నిష్క్రమింతురు.)



శ్రీ

# కల్యాణరాఘవము.

## ద్వితీయాంకము.

(ప్రదేశము—వీధి. ప్రవేశము—కావేరి, రుచిర.)

కావే—రుచిరా! వేగరా! అట్టు లడుగులో నడుగు పెట్టెద వేల?

రుచి—మాయమ్మ కైకమ్మకుఁ గడుపుచేత మందగమనము వచ్చియుండ నాకుఁ గాలిపై కురుపుచే వచ్చియున్నది.

కావే—ఇట్లిప్పటికి నేల తిరుగుచున్నావు?

రుచి—కురుపుకంటె దొరసాని యెక్కువ నొప్పుచున్నదమ్మా.

కావే—మా కౌసల్యకుఁ గడుపు రాలేదా? సుమిత్రకుఁ గడుపు రాలేదా? కైకమ్మ వీరిద్దఱికంటె నెక్కువ సుకుమారియా? తానంత "అస్సు ఉస్సు"ఁ బడుచున్నదేమి?

రుచి—కావేరమ్మా! చెప్పిననమ్మవేమో కాని చూడుము! ఎవరితోడ నయినఁ దిరుగ ననఁబోకుసుమా! నాతోఁ జెప్పెసరి. ఇదిగో! ఆ పాయసముఁ దిన్న మఱునాఁటియుదయ మారంభము. ఒక్కటే వేవిళ్ళు! విసె, విరామము లేదు. ఇటుగుటుక. అటు "టక్కు" వెలుతురకంటెఁ బడుటకు వీలు లేదుగదా! ఎవ్వరిని జూచిన ససహ్యతగదా! ఇదిగో

మొగఁడనంగ నాలాగునఁ బాగులాడెడిదిగదా! ఇప్పుడతఁడనంగ పట్టి గొంగళిపురుగు. రోకలిబండ. ఆ మహారాజు—పాపము. ఆతనిఁ జూచిన జాలియగును—తన్ను భార్యదగ్గరకు రానిచ్చునట్లు చేయుమని నన్ను బతిమాలుచున్నాఁడు.

కానే—ఇదేమిచోద్యమమ్మా! నెలలునిండినతరువాతఁగూడ వేవిళ్ళేమిటి? మా మేనత్తకేడు నెలలుండునపరికే యూరునాడుకూడ పోరాకెత్తిపోయినది. ఇది మఱియుఁ జిత్రముగనున్నది. ఏమి కౌసల్యమ్మగారమ్మా! ఇదివఱకాలాగునఁ దుబుకుమనలేదుగదా! కాని నీవిప్పుడెక్కడకు వెళ్ళుచున్నావు?

రుచి—సెనగపులుసుకంటెఁ బుల్లనిదేదయినఁ దోయితెమ్మన్నది. ఎవరినిందుగూర్చి యడిగినవారే నవ్వుచున్నారు. చూడు! మనలోనునమాట. నన్నుఁ జేరఁదీసిన యయ్యవారలేమనెనో వింటివా? పైకమున్నకంటె గయ్యాళిలభించినప్పుడదికూడ దొరకునని నాఁడు.

కానే—సెనగకంటె పరసుపుండిన యెడల ననికూడఁ జెప్పినాఁడా? ఆతనిమాటలెవతె యెఱుఁగదు? కాని సెనగపులుసుకంటె బుల్లని వస్తువేదో నేనుఁ జెప్పెదను. ఉండు. నోటిచివర నాడుచున్నది. ఏదో ఘృతమునమ్మా! స్త్రీలకొఱకు ముఖ్యముగఁ జేయఁబడినదఁట! మిగుల రుచించునఁట. ఆనడుమ నూరిలో నమ్మలక్కలందఱు చెప్పుకొనినా రమ్మా! ఏదోఘృతము. ఊఁ—ఉండు! పుల్లకవిఘృతము.

రుచి—అబ్బే! అది ఘృతముకాదు. వేవిళ్ళచేత మాందార సాని రుచిగ్రహణశక్తి యెట్లున్నదో విద్యావిహీనతచేత మాయయ్యవారలి గుణగ్రహణశక్తి యట్లున్నది. అదిపుల్లకవికృతము. పుల్లకవిచేఁ జేయఁబడిన వైద్యగ్రంథమో వల్లకాదో. అది తెచ్చి మూడవరాణి గారి మూతికిఁ గట్టవలెనందువేమి?

కావే—చక్కని గొన్నవారు మీరెక్కడ గట్టుకొనినఁ గట్టి కొందురు; నాకెందులకమ్మా! నేను బోయెదను.

రుచి—వదినా! కోపమా! ఎప్పటికిఁ బోదలఁచితివో చెప్పవా!

కావే—చెప్పుటకు రహస్యమేమున్నది? మాయమ్మ వసిష్ఠ భగవానుని యాశ్రమమునకుఁ బోయి వారిచ్చటనున్నారేమో కనుగొనిరమ్మన్నది.

రుచి—ఎందులకో!

కావే—నాకుఁ దెలియలేదు.

రుచి—పురుడు శీఘ్రముగ రానై యున్నదని సందేహము చే సుళువుగా రిందలనున్నారో లేవో కనుగొనుమన్నదేమో?

కావే—పురిటికిఁగావలసినది మంత్రసానియా? మహర్షియా?

రుచి—అదేమిమాట! శిశుజన్మకాలనిర్ణయము మొదలగు పనులకు గురువుగా నుండవలదా? కాని మీయమ్మగారిప్పుడేమి చేయుచున్నారు?

కావే—నేనిటు వచ్చుచుండఁగనే మా చెల్లెలిని బిలిచి "రాజుగారి నిటకురమ్మని కోరితినని చెప్పుము." అని దానితోఁ జెప్పెను.

రుచి—సరి! ఇఁకనేమి. నేననినదే నిజము. ఈసరికి రాజుగా రామెయొద్దకు వచ్చియుందురు. కావున నీవు వేగ పొమ్ము. నేనును బోయి యదియో యొక్కపుల్లని వస్తువును దీసికొని పోయెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



## ద్వితీయాంకము.

ప్రదేశము—కౌసల్యాంతఃపురము.

ప్రవేశము—దశరథుఁడు, కౌసల్య.

దశ—ఏల ?

కౌస—వంగి మీపాదములను శిరమున నద్దుకొనుటకు నాకు మిగుల కష్టముగనున్నది. అందుచే దయచేసి మీపాదములను నా తొడలపైనుంచుఁడు. చేతుల నెత్తి కన్నుల కద్దుకొందును.

దశ—ప్రాణప్రియా ! నీవిట్టిపనులు చేయుచున్న నేమి ?

కౌస—నాథా ! (గద్గదికతో) ఏమియు లేదు.

(కన్నుల నీరునించుకొనును.)

దశ—ఆ! ఆ! అదేమి కౌసల్యా ! ఎందులకు ? (మొగము నెత్తి కౌఁగిలించుకొని) హా ! ప్రాణప్రియా !

గీ. చెప్పవా! చెప్పవా! నీదు ♦ గొప్పకనుల
కొలుకులనువేఁడి కన్నీళ్లు ♦ లొలుక నేల ?
చెక్కు లెఱుపెక్కనేల ? ♦ నీక్కృతులఁ బె
దవులొడులనేల గుండెల ♦ దడయు నేల ?

కౌస—(దైన్యముతో) నాథా ! నాకేమియుఁ దోచుటలేదు. లోపల నేమియో యావేదనముగనున్నది. గర్భమున నేదియో తళుక్కుమని ప్రవేశించినట్లు నున్నది. కనులు చీకటులు గ్రమ్మినవి. అమితముగ

భయము వొడముచున్నది. నాథా! నేను సిగ్గువిడిచి చెప్పుచున్నాను. లోపలనేమో యత్తైగాత్తె యంతయు వ్యాపించుకొనిన నెదుగుచున్న పిల్లవాఁడది నాప్రాణము లెట్లు నాడించుచును. నాగర్భమునందున్న మీ తేజస్సు నెట్లు కాపాడుకొందునో! అందుచేత మీతో నాలుగు మాటలు చెప్పి మీకు నొకసారి నమస్కారము సమర్పించుకొనవలెనని —

(ఏడ్చును.)

దశ — ఛీ, సీ. ఏడ్చెదవా! ఇదిగో! ఇటుచూడుము.

కౌస — నాప్రాణంబులనిష్ఠురాకుఁడు. విశేషముగ మాటలాడ లేను. నేను గాపురమునకు వచ్చినది మొదలు మీయెడం బహుభక్తి విశ్వాసములతో నడుచుకొనుచుంటిని. మిమ్ము నాభూలోకదైవముగాఁ బూజించుకొనుచుంటిని నా నమ్మకము. పొరపాటునైన నేమైనఁ దప్పులొనరించి యుండిన యెడల దయార్ద్రబుద్ధితో క్షమింపఁగోరుచున్నాను. ఇదిగో నమస్కరించుచున్నాను.

దశ — చాలునే. ప్రాణప్రియా! చాలు. ఇటురా! నాతోడ పైఁ గూర్చుండుము (భార్యనెట్టుకూర్చుండఁ బెట్టుకొని) నీకిట్టులఁ బడదగునా? భయమేల?

(తనలో) సీ. ఆత్మజుఁడు గల్గునేమో య ♦ టంచు నాస
వలనఁ బడని బాములు లేవు ♦ పట్టినట్టి
కాళ్లు లేవు మ్రొక్కనియట్టి ♦ రాళ్లు లేవు
మునిఁగనట్టి నదులు లేవు ♦ మున్ను మఱియు.

గీ. విననిపుణ్యకథలు లేవు ♦ కననితీర్థ
ములును లేవు, చేయనివ్రత ♦ ములును లేవు
బొనరుపని దానములు లేవు ♦ పొక్కి పొక్కి
దొప్పను కుములి యేడువని యే ♦ డుపులు లేవు.

గీ. యజ్ఞదేవ ప్రసాద మా ♦ హాత్మ్యమునను.
జింతలఁ బొగంబెనంచు నెం ♦ చితిని గాని
సతులు గర్భధారణకళా ♦ వతులు గాఁగ
నిప్పుడొకనూత్నచింత వే ♦ ధించుచున్న.

సీ. అంతంత మొగములై ♦ యంతంత ముక్కులై
యంతంత యుదరంబు ♦ లైన వింత
యాకారములతోడ ♦ నేను ముక్కులఁ బోలె
పలుచపల్చని వెల ♦ వెలలతోడ
నిదుర మబ్బులతోడ ♦ నిట్టూర్పుబుసలతోడ
నీరుపట్టినకాళ్ళ ♦ బూరతోడ
మెలమెల్లనెదురీఁత ♦ యలపుల సొలపుతో
గాజుకాయలవలెఁ ♦ గానఁబడుచు
గుత్తుకుత్తను నిల్లాండ్రు ♦ గోడుచూడ
గుండెలు పటాలుమనుచుండు ♦ రెండుతలలు
నెప్పుడేర్పడు నెప్పుడు ♦ గుప్పుచప్పు
నను బయటఁబడువారమో ♦ యనెడువగను.

గీ. ఏకసతియున్నవానికే ♦ యింతబాధ
యనఁగ ముగురున్ననాబ్రదు ♦ కడుగనేల?
ఉవిదలెందరున్నను సౌఖ్య ♦ మొకటెకాని
కుడుచు కష్టంబులెన్నియో ♦ నుడువనగునె?

గీ. ఇదియె తొలిచూలు వయసు గ ♦ తించు వెనుక
రాక రాక యబ్రముగాఁగ ♦ బ్రాప్తమయ్యె
నేమగునోయంచుఁ గౌసల్య ♦ యిట్లువగచు
గోల! యెఱుఁగదు; సుకుమారి ♦ కోమలాంగి.

(ప్రకాశముగా) ప్రాణప్రియా! నీకేమియు భయము లేదు. దైవ కటాక్షమునఁ గులగురులగు వసిష్ఠభగవానుల యాశీర్వాదమున నీవు సుపుత్త్రుని నేఁడో రేపో కాంతువు.

కౌ—రేపటివఱకు నేనీబాధ పడుచుండవలసినదా? ఆ! నా వలనఁగాదు.

దశ—(కౌసల్యను ముద్దిడుకొని)

గీ. వాగ్ధకము దరిసేకు సం ♦ ప్రాప్తమైన
చూలుపుణ్యమాయని ముద్ద ♦ రాలితనవు
నీదు ముద్దులుఁ జూలుకొఁట, ♦ నెఱిసొగసులు
మురిపములఁగాంచి తిరుగ ను ♦ ప్పొంగుచుంటి.

కౌ—ఇప్పుడు పరిహసించుచుంటిరా?

దశ—ప్రియురాలా! క్షమింపుము. ఇప్పుడు నేఁజేసిన పరి హాసమునకు నీకొడుకు చేయిఁబట్టుకొని యిట్టియిట్టిముందునన్నుఁ దిట్టింతువుగానిలే. చూడు. (కడుపుపైఁ జేయివైచి)

గీ. కడుపులోఁ జిన్నిబుడుతఁడు ♦ దుడుకుదుడుకు
మనుచునీటిలో మత్స్యంబు ♦ ననువుఁదోఁప
దళుకు తళుకని స్ఫురియించి ♦ తుళకరించు
మేఘగర్భస్థమగు నెఱి ♦ మెఱుపువలెను.

కౌసల్యా!

గీ. ఎగుమొగంబగు గర్భంబుఁ ♦ దిగఁబడియెను
డొక్కలెత్తునుబాసి లోఁ ♦ తెక్కెఁ గడుపు
బడిబడిగ బిగబట్టెను ♦ ముడుగులివిగో
నింకె వడిగనే ప్రసవింతు ♦ వింకనేమి?

నీవు రేపటివఱ కుండనక్కఱ లేదు. ఈదినముననే శుభప్రసవము చూపుగాక! నీదాసి యొవతెయయిన నక్కడనున్నదా ?

కౌ—అందఱను బంపివయిచితిని. ఏల ?

దశ—ఏలయందు వేల? పిలిపింపవలసినవారిఁ బిలిపించి, వలసిన సన్నాహమంతయుఁ జేయింపనక్కఱలేదా ?

కౌ—తొందరపడకుఁడు. ఎవ్వరిని బిలిపింపవలదు. ఇఁక గొంత సేపు చూతము.

దశ—ఇంకఁ జూచున దేమి. (గట్టిగ) కావేరీ!

(నేపథ్యమున) బాబూ! వచ్చుచున్నాను.

కౌస—దానితో నిందుకొఱకని చెప్పెదరాయేమి? వలదు.

దశ—దాసికయినఁ దెలియకుండ నెటులు ?

కౌ—ఇప్పటినుండియునా? ఈదాసుల చెవినిఁబడిన ముక్క నీటిపైఁబడిన నూనెచుక్క.

దశ—అటులయిన యిప్పుడేమిచేయుమంటివి ?

(నేపథ్యమున) అమ్మా! లోనికిరావచ్చునా ?

కౌస—కావేరీ! రావచ్చునుకాని నీవిచ్చటకువచ్చి చేయున దేదియులేదు. జపమగునెడలఁ బూజ్యురాలగు నరుంధతీదేవిగారిట కొకసారి దయసేయుదురేమో కనుఁగొనెదవా ?

దశ—(నిమ్మళముగ) జపము వదలియయిన శీఘ్రముగ నని చెప్పరాదా ?

(నేపథ్యమున) అమ్మా! పోయి చెప్పెదను.

కౌ—సరే.

దశ—వసిష్ఠభగవానునకెప్పుడు వార్తనంపుదము.

కౌస__ఆమె పెద్దది. మిగులఁ దెలిసినది. వచ్చినతరువాతనన్ని యేర్పాటులును సందడి లేకుండ నామెయే చేయును.

దశ__సంతోషమే. నీకింక భయమేమియు లేదుకద.

కౌస__లేకేమి! ఇప్పుడంత బాధ లేకుంట చేస్థిమితతగనున్నాను. ఇదియంతయుఁ గడచి గట్టెక్కి తిరుగమీతో సుఖింపఁగలనా?

(నేపథ్యమున) ఆ! ఆ!

దశ__ఆహా! వింటివా? ఎట్టి సదుపశుభ్రతియయినదో.

కౌ__కావేరీ! ఆ. ఆ. యనుచున్నావేమి?

(నేపథ్యమున) దేవిగారు మహారాజుగారియొద్దనేయున్నారా? యని రెండవరాణిగారి దాసిగంగ చేసిన ప్రశ్నమునకు ఆ. ఆ. యనుచున్నాను.

కౌ__భగవతియగు నామెతో మనవిఁజేసితివా?

(నేపథ్యమున) ఆ, వచ్చెదననినారు.

కౌ__తొందరగ దయసేయుమని చెప్పలేదుకద.

(నేపథ్యమున) ఉ. హు.

కౌ__సరే. పొమ్ము. నాథా! నా చెల్లెలు సుమిత్ర నన్నుఁ జూచుటకయి రాఁదలచి దాసిచేవార్తనంపియున్నదికాఁబోలు. నేను సెలవు తీసికొనివెళ్ళనా?

దశ__నీవు వెళ్లుటయేల? ఆమెయే యిక్కడికు రాఁగూడదా?

కౌ__సరి.సరి. చాలులెండు. నాథా! నేనొకరహస్యపుమాట నడిగెదను. చెప్పెదరా?

దశ__తెలిసినయెడల.

కౌ__సుమిత్రగర్భము కైకమ్మ నాగర్భములవలె లేదేమి?

దశ — లేక ?

కౌ — మిగులఁ బెద్దదిగానుంటయేకాక ప్రాకృతిచేఁ గూడవింతగ నున్నది. ఈపక్కను బెరిగియున్నది. ఆపక్కను బెరిగియున్నది. బొంతయరఁటిపండునవలె నడుమ గొంచెము వెలితిగనున్నది. ఎందుచేత?

దశ — ఆమె కవలపిల్లలను గాంచుననితోఁచుచున్నది.

కౌస — అమ్మయ్యో! ఇద్దఱుపిల్లలే. నాకొడలు జలదరించుచున్నది. ఏమండి నేనడిగిన ప్రశ్నమునకుత్తరము చెప్పకపోయితిరి?

దశ — ఉపశ్రుతియే చెప్పినది.

గీ. నీదు నునుఁజొమ్ము తలగడ ♦ మీఁదఁదలయు
నాదు నెదపైనఁ గాళ్ళుంచి ♦ నీదు సుతుఁడు
పండి యెడనెడఁగుయికను యం ♦ చుండఁ గలసి
యతని జోకొట్టుచును సుఖ ♦ మందగలము.

అంతకంటె మనకికఁ గావలసినదేమి?

కౌ — అంతవారమగునెడల నిఁకఁ గావలసినదేమి? నాకుఁ గొంచెము కష్టముగనున్నది. నేనింకఁ బోవుదును. (పోఁబోవుచు) వైకుంఠవాసా! నాహృదయమునకుండుము. గురు వసిష్ఠ భగవానుఁడా! నమస్కారము.

(కన్నులనీరు పెట్టుకొని) ప్రాణనాథా! నమ — స్కా —

దశ — ప్రాణకాంతా! వలదు. నీవు నమస్కరింపఁదు నేనే నీకు నమస్కరింతును. (తనలో)

గీ. కష్టములకోర్చి మృతికిజం ♦ కక యపార
సర్వసృష్టి మహాతంత్ర ♦ సారసరణి
చిన్నతన బొజ్జని ముడుచు ♦ కొన్న గర్భ
వతియె ప్రత్యక్షపరమ దై ♦ వంబుగాదె

శ్రీ శేషశయన పరబ్రహ్మణేనమః (నమస్కరించును.)

కౌ—(మోమెత్తి తేరిపాఱం జూచును.)

దశ—సతీ! అట్లు నిశ్చలముగఁ జూచెదవేల?

(తనలో) గీ. కసరినను దిండ్రపడినను ♦ కైకయాజ్ఞ
భీతిమన్నించి తనమాట ♦ వినకయుండి
నను జలువచూపు వలపుల ♦ నవ్వుపూలఁ
జల్లు నీమె జ్వాలలవెదఁ ♦ జల్లునేల?

(చేయిఁ బట్టుకొని) కౌసల్యా! మాటలాడవేమి? ఇట్లు రోజెదవేల!

కౌ—(దశరథుని ద్రోసివయిచి) ధనుస్సు! ఏదీధనుస్సు—
హా! హా! హా!

(చేయి విదల్చుకొని అట్టహాసము చేయును.)

దశ—హాహాహా! ఇదియేమి?

గీ. మోవి కెలఁకుల దాటిపైఁ ♦ బోనిచిన్న
మొలకనవ్వుల నను, కతి ♦ గొలుకు లెడలి
పోని చూపులముగ్ధని ♦ ష్పలను గురిసి
యట్టహాసముసేయు, వీ ♦ రాగ్రణివలె,

గీ. అంగుళుల యుంగరము లె బ ♦ ర్వించునోలు ము
నబల, యిల్లాలు, మూలింత ♦ రాలు, నన్ను
భీకరాసురహరుని ను ♦ ర్వొత్తుగాఁగ
గోటికొన విరాళు నిదియేటి ♦ పాటవంబొ!

గీ. వీణయో! కేళికాబ్జమో? ♦ ప్రాణనాథు
నడిగెదః పాదయుగ్మకమో! చిత్ర ♦ ఫలకమొక్కొ!
దయాతుదానికి ధనుసేల! ♦ యక్కటకట!
కౌ—త్రికింతలో మతి చలి ♦ యింపఁగలదె?

ఇదిసమాసన్నప్రసవసూచకమగు తొట్రుపాటుకాదు. ఏదయినభూతా వేశించి యుండవలయును, లేదా పెద్దలో పేరటాండ్రో మ్రొక్కు- కొందును. ఏదయిన మీఁదుఁ గట్టవలసినయెడలఁగట్టుకొందును. శిశు వున కెవరిపేరు పెట్టుకొనుమన్న వారిపేరు పెట్టుకొందును. ఓకుల దేవతలారా! ఓపితృదేవతలారా! మీయారాధనమున నేమయిన కొఱంతగావించియుండినయెడల నన్నుక్షమింపుఁడు. మీకోరికలేవో దయచేసి స్వప్నరూపమున వెల్లడింపుఁడు. అంతేకాని

గీ. అనువదను వేలమేకులు ♦ మొలచుచుండఁగ
నున్నకత్తై మాంధవృక్షముఁ ♦ జన్ని చిగురు
పెట్టినున్నది, తతదయా ♦ సృష్టిఁ గలిసి
పెంచుకొనుఁడు, మీయదిమీరు ♦ వెనుకకఁగనె !

(ప్రకాశముగా) కౌసల్యా! (దరిఁ జేరఁబోయి) ఆహా! తిరుగఁ బ్రోచి వచ్చిన నెక్కడఁ బడిపోదునో ?

గీ. అసురరణ రంగములను బా ♦ కారి వెన్కఁ
సంగుపట్టుల ప్రబలర ♦ క్షః పిశాచ
ఖండనోద్దండతాభి ము ♦ ఖ్యంబుగాంచు
నేను సతిఁ జూడఁ జాల మో ♦ మెత్తి యహహా!

ఆహా! నాసతియేమి దివ్యదర్శనమిచ్చుచున్నది!

గీ. పరమగుచు, నగాధమగుచు ♦ పరివిమలంబు
నగుచు, దుర్నిరీక్ష్యమగుచు ♦ నమితమగుచు
వర్ణనాతీతమగుచు దు ♦ ర్గాహమునగుచు,
నొకమహాతేజమంటఁ గాం ♦ చున్నదహహా!

కావేరి! కావేరీ!

(నేపథ్యమున) బాబూ!

దశ—వసిష్ఠ భగవానుని శీఘ్రముగ దయచేయుఁడని చెప్పి వెంటఁబెట్టుకొనిరా! వెళ్ళితివా?

(నేపథ్యమున) ఆ!

దశ—నాకు మతి లేదు. చైతన్యమే లేనట్లున్నది. వైకుంఠనిలయా! పన్నగశయనా! నాతండ్రీ! ఏమి యీమాయ! ఏమియుఁ దోచకున్నది. ఎవరిదో కాలిచప్పుడగుచున్నది. గురువులవారు విచ్చేయుచున్నారు కాఁబోలు. (కొంచె మెదురుగఁబోయి) మహాత్మా! దయచేయుఁడు.

[వశిష్ఠుఁడు ప్రవేశించును.]

దశ—మహానుభావా! నమస్కారము. మహాసముద్రమున బడియున్నాను. కౌసల్యవంకఁ జూడుఁడు. అదేమి?

వసి—(నవ్వుచు) మహాసముద్రమున నీవు బడియుండుట కాదు. మహాసముద్రమునఁ బడియున్నయాతఁడు మనయింటికింక విచ్చేయును. ఈదినమే సుదినము నీబ్రదుకంతయు నిందుకొఱకే! నాజప మంతయు నిందుకొఱకే!

దశ—మహాత్మా! కౌసల్యకేమియు నాపత్తు లేదుకదా?

వసి—(నవ్వుచు) దేవతలయాపత్తులిఁక నణఁగిపోవును. ఋషులయాపత్తులింక దీఱును. లోకములయాపదలు మాయమగును.

కౌ—(పీఠమునుండి దుమికి) రే! సకలసురనికరసుఖరమారంభ విమర్దనా! రే! సకలపవిత్రమహర్షిజాల జపతపోభంగ సమాచరణ సాహితీసనాథా! సాధుసాధ్వీయూథ బాధాచరణ విదగ్ధా! సత్యదయాశౌచ ధర్మశూన్యా! మహామాయావీ! రే! లోకకంటకా! రాక్షసాపశదా! కుంభకర్ణాగ్రజా! రావణాధమా! తాదికో! నీమరణమింక నిశ్చయము! పుత్త్రపౌత్త్రకళత్రబంధుమిత్ర

పరివారసహితముగ నీచావు సమీపించినది. ధనుస్సేదీ! తమ్ముఁడా! ధనుస్సు—

వసి—సెభాస్ ! వినఁదగినమాటలువినఁబడినవి. ఈకర్ణములు పవిత్రములయినవి.

దశ—మహర్షి చంద్రమా! ఇదియేమిటి? అయ్యయ్యో! ఆ పీఠము పైనుండి క్రిందకు దుమికెను. గర్భమేమగునో? గుండెలదఱి పోవునట్లే మాటలేమిటి?

వసి—రాజచంద్రమా! ఏమియుఁ జెడియుండదు. ఒక గడి యలో నింక భగవంతుఁ డవతరింపఁగలఁడు. ఆతనిముందు చర్యయే యిప్పుడు వెల్లడింపఁబడినది. అదృష్టవంతులలో నగ్రగణ్యుఁడవునీవే! నింద్యమగు పురోహితవృత్తి నవలంబించి నీయింటనింతకాలమునుండి పడికాపులుపడుచు నేనుండుట యీమహాసుదినముకొఱకే.

దశ—తానేయింకఁ బుట్టలేదుకదా! తమ్ముఁడా! ధనుస్సేదీ యనుచున్నాఁడేమి? రావణు నీతఁడు వధియించునా?

కౌ—(పండ్లుకొఱుకుచు, గట్టిగ) వధియింపక—ఇంకనుపేకుయా! ధనుస్సు. ధనుస్సు. హా! హా! హా!

(విఱుచుకొని క్రిందఁబడును.)

దశ—అయ్యో! అయ్యో! (కౌసల్యనుబట్టుకొని) కౌసల్యా! కౌసల్యా! మహర్షిచంద్రమా! ఇదియేమి?

వసి—మరేమియు జడుపకుము. గర్భముననున్న మహాతేజ మామె భరియింపలేక పోవుటచేనట్లయినది. తొందరలేదు.

దశ—కౌసల్యా! కౌసల్యా! ఇంకనుస్మృతిరాలేదు. గురూ త్తమా! ఏమిగతి?

వసి—నాకమండలూదకము నీమొపై కొంతచల్లెదను. (అట్లు చేసి) కౌసల్యా !

(కౌసల్య లేచును.)

(కౌసల్య అటునిటు తొట్రుపాటుతోఁజూచి)

దశ—ప్రాణకాంతా! నీకిపుడెట్లున్నది? ఇదిగోఁ అటుచూడుము. వా రెవ్వరు ?

కౌస—పురుషోత్తమా! నమస్కారము. నాథా ! అట్లడిగెద రేమి ?

వసి—(అపవారించి) రాజోత్తమా ! ఆమెకిప్పటివృత్తాంతము తెలియనీయకపోవుటమంచిది. వెంటనే సూతికాగృహమున కామెను బంపుము.

దశ—కావేరీ !

(నేపథ్యమున) బాబూ ! వచ్చుచున్నాను.

వసి—రాజా ! నీవుకూడ లోనికిఁబోయి తద్గృహసమీపమున నుండి శిశూదయముగు వెంటనే యొకగంట వాయింపఁబంపుము. నే నిచ్చటనేయుందును.

దశ—తామొక్కరే యిక్కడ దయచేసియుందురా ?

వసి—నాశిష్యునిరమ్మని చెప్పి వచ్చితిని.

దశ—కావేరీ! ఇంక రావేమి ?

(నేపథ్యమున) అరుంధతమ్మగారువచ్చినారు. ఆమెకుఁ బూజా మందిరములోనికిఁ దారిచూపుచున్నాను.

దశ—సంతోషమే ! నీవిక్కడకు రానక్కఱలేదు. నేనే కౌసల్యనటకుఁ దీసికొని వచ్చెదను. మహానుభావా ! సెలవా ?

వసి—మంచిది.

దశ—(కౌసల్యనుబట్టుకొని) దేవీ! నీగర్భమున కెక్కడను దెబ్బతగిలినట్లు లేదుకద. అంతయు సరిగనున్నదికద?

కౌస—(అపవారించి) ఏమియు లేదు. ప్రాణప్రియా! నీవుమహా తేజస్సంపన్నుఁడగు పుత్త్రుఁడు కలుగునని గురువుగారుమంగళాశాసన మొనర్చిరిసుమా!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

వసి—రెండుయామముల వేళకావచ్చినది.

గీ. తనకులంబునఁ దనకంటె ♦ ఘనసమగ్ర
విమల తేజోవిరాజిత ♦ విగ్రహంబు
పుట్టివంశంబునకు వన్నెఁ ♦ బెట్టుననుచుఁ
బద్మబంధుఁడు నడునింగిఁ ♦ బ్రబలియుండు.

శిష్యుఁడు—(ప్రవేశించి) ఇదుగో శిష్యుఁడు, గురువుగారు నా కొఱకుపైకిఁ జూచుచున్నారేమి?

వసి—ఓరీ, శంతా! నీవు వచ్చితివేల? వాఁడేఁడీ?

శిష్య—నేను మాత్రము శిష్యుఁడనుగానా?

వసి—సరే. కూరుచుండుము. ఈదిన మేతిథియో యెఱుఁగుదువా?

శిష్య—ఏదయిన గొంచెమాధారమున్న గాని చెప్పలేను.

వసి—ఏమాధారము?

శిష్య—ఈసంవత్సరము పంచాంగముచేయుటకుఁ గ్రిందటి సంవత్సరపుఁ గణితముకొంత యావశ్యకము. నిన్నటితిథి తెలిసి కొనుటకు నిన్నటితిథి తెలియుటఁ గొంతయావశ్యకము.

వసి—నీకింకఁ జదువు రాదు. నీకు నావలన నేమియు నుపయోగించునట్లు తోఁచదు.

శిష్యు—ఆసంగతి నేనెఱుఁగక పోలేదు.

వసి—అటులయిన మఱియెక్కడకయినఁ బొమ్ము.

శిష్యు—అన్ని స్థలములు చూడనిదే యిక్కడకు రాలేదండి. నాపూర్వగురువులందఱు తమరుగట్టివారని చెప్పిరి. నాదురదృష్టమున నన్యథాయయ్యెను. నేనునింకఁ జదువు మానివైచి తపమో, కవిత్వమో మొదలు పెట్టవలయునని యేచూచుచున్నాను. కాని యీమహారాజు గారి పుత్రోత్సవాదులలో నేమయినలాభించు నేమోయనియాస బెట్టుకొనియున్నాను. రాజభార్యలకుఁ దొమ్మిది దాఁటినది. పదిపదునొకండు దాఁటినది. పండ్రెండవమాసము నడుచుచున్నదని తెలియుచున్నది. మూఁడు తొమ్మిదులు కాఁబోలును. అందుచే నింతట దేలునట్లు తోఁచదు.

వసి—అక్కరలేదు. కౌసల్యాదేవి గర్భమున మహాతేజశ్శాలి యగు పుత్రుఁడిఁక పావుగడియలో జన్మింపనై యున్నాఁడు. శుద్ధనవమి-పునర్వసూనక్షత్రము. అన్నియు బాఁగుగనున్నవి.

శిష్యు—నవమినిఁ గూర్చి నాకుఁ గొంచెము సందేహముగ నున్నది.

వసి—ఎందుచేత ?

శిష్యు—జన్మమనఁగా నింటిలోఁ బ్రవేశము కాదా ? ప్రవేశ నవమి నిషేధముగదా?

వసి—నీమొగము ! ఆమహాతేజ మిడివఱకే దేవీగర్భమునఁ బ్రవేశించినది. ఇప్పుడు ప్రత్యక్షముగుటయే జరుగనై యున్నది.

శిష్యు—ప్రత్యక్షనవమిమాత్రము నిషేధముకాదా ?

(లోనగంటవినఁబడుచున్నది.)

శిష్యు—అద్దీ ! సత్యము, నేను జెప్పినమాట సత్యము.

వసి—ఆగంట నీకుపశుప్రతి కాదు. అది శీర్షోదయమగువెంటనే వాయించినగంట. దీనినిఁబట్టి తరువాత జాతకచక్రము వేయుదును.

శిష్యు—శీర్షోదయసమయము మనకుఁ బ్రధానము కాదు. మూఁడు దినముల క్రింద శీర్షోదయము కాసిందు. అదిమనకు లెక్క కాదు. భూపతన సమయమే ముఖ్యము.

(నేపథ్యమున) ఫిరంగులధ్వనియు ఢంకాభేరీవాద్యములధ్వనులు వినఁబడును.)

వసి—ఆహా ! మంగళవాద్యములు వినఁబడుచున్నవి. భగవానుఁడవతరించినాఁడు. లోకమునకెట్టి శుభదినము సిద్ధించినది ?

గీ. చైత్రమందునశుద్ధ ప ♦ క్షమునవమి
తిథిఁ బునర్వసూ తారను ♦ విధుగురుయుత
గర్కటక శుభోదర్క ల ♦ గ్నమునను బుధ
వారమునను శ్రీహరి యవ ♦ తారమందె.

(నేపథ్యమున) జనులారా ! సందడిసేయవలదు. మీకందఱకు సంతుష్టికరముగఁ బంచిపెట్టించెదను.

శిష్యు—సుమంత్రుఁడు సేవకులచే ఖండశర్కరజనులకుఁబంచిపెట్టించుచున్నాఁడు. నేనుగూడఁ బోయి తెచ్చికొందునా ?

వసి—పో—

శిష్యు—(పోవును)

(నేపథ్యమున) సుమంత్రుఁడా ! యథేష్టముగ నిష్కములఁ

బంధి పెట్టింపుము.

వసి—రాజేంద్రుఁడదుగో! యిటకు వచ్చుచున్నాఁడు.

దశ—(ప్రవేశించి) నమస్కారము.

గీ. అంధునకు నేత్రసంపత్తి • యమరెఁ బుల్ల
విఱిగి మోడైన చెట్టు పు • ష్పించెఁ గదుపు
కలవగు దరిద్రునకు • రత్నఖనిలభించె
దాసునకుదొడ్డగతిగల్గె • దాపసేంద్ర.

వసి—దాసునకేగాదు దేశమునకంతకని చెప్పుము.

దశ—బాలుఁడు బహుతేజస్వియై యున్నాఁడఁట.

వసి—నీవింకఁ జూడలేదా!

దశ—నాకు దైవసములగు మీరుచూడకుండ నేజూచెదనా? వత్సకు శుభస్నానమయినది. నేను గూడస్నానమొనర్చి పరిశుద్ధుఁడనయియున్నాను.

వసి—జాతకర్మాది కృత్యములింక నిర్వర్తింపవలసి యున్నవి.

దశ—కావేరీ! బాలునిట్లు తీసికొనిరమ్ము మహర్షిసత్తములకుఁ జూపింతును.

(కావేరి పొత్తులలోనుంచి వత్సను దెచ్చును)

దశ—పిల్లవానిని ముందు గురువుగారికిఁ గానఁబఱుపుము.

వసి—రాజేంద్రా! నీవుకూడ జూడుము.

దశ—(చూచుచు) ఎట్లులున్నాఁడు?

వసి—ఇదికన్ను. ఇదిముక్కు. ఇది చెవియని నాకేమియు విస్పష్టముగఁ గానఁబడుటలేదు.

గీ. కనులు మిఱుమిట్లుగొల్పి పు ♦ ల్కలనొసంగి
మోదబాష్పములను వెల్చు ♦ పూర్ణ విమల
శాంతగంభీర తేజంబు ♦ స్వల్పపూర్వ
పరిచయముగల యదియొ చూ ♦ పట్టెనాకు.

దశ—గురువర్యా! అదియేమి? ఇంతపిల్లవాఁడు విస్పష్టముగఁ గానరాఁడనుచున్నారేమి?

ఆ. వె. అరగమూయునపుడె ♦ యంతంత తెల్కనుల్
విప్పినప్పుడెంత ♦ గొప్పలగునొ?
మూట గాఁగ బండు ♦ బుడుతఁడింతగనుండ
సాగియుండె నెంత ♦ సొగయగునొ?

గీ. మెఱుఁగుఁ జామనచాయల ♦ పొంగఁగుల్కోడ
డంబుమీఱెను గుండ్రిగ ♦ ద్దంబుతోడ
ముద్దులనుమూట గట్టె నె ♦ మ్మొగముతోడ
నితఁడు నయనాభిరాముఁడై; ♦ యెసఁగునాకు.

గురువర్యా! ఈతని కేమిపేరు పెట్టిన బాగుగనుండునో తెలిపెదరా?

వసి—నీవు సూచించుచునే యుంటివి కాదా? ఈతఁడు సర్వజన నయనాభిరాముఁడు. కావున రాముఁడని పేరు పెట్టుదము.

దశ—తగినపేరు సెలవిచ్చితిరి.

వసి—ఈతఁడు ముందుచేయు లోకోపకారక కృత్యములను బట్టి యాపేరింతకంటెఁ దగియుండఁదలఁచియున్నది.

దశ—అంతయు దమ యనుగ్రహము. సుమిత్రయుఁ గైకయు బాలురఁజూచిరా?

కావే—సుమిత్రమ్మగారు చూచినారు. కైకమ్మగారుచూడ లేదు

దశ — ఎందుచేత ?

కావే — ఆమె బద్ధకముగా నున్నారు.

వసి — రేపటిదినమున నీసరికి రెండవపుత్త్రునెత్తికొనియుందువు జాతకర్మాదులాలసింపఁదగదు. లోనికి విజయము చేయుఁడు. నేను స్నానమొనర్చివచ్చెదను.

దశ — చిత్తము !

(అందఱు నిష్క్రమింతురు.)





శ్రీ

# కల్యాణరాఘవము.

## తృతీయాంకము.

ప్రదేశము—సరయూనదిగట్టు.

పరివేశము—విశ్వామిత్ర శిష్యుఁడు నారాయణుఁడు;

వసిష్ఠ శిష్యుఁడగు శంకరుఁడు.

శంక—నారాయణుఁడా! మనముగలసియెంతకాలమైనదో?

నారా—శంకరా! శ్రీరామ జన్మోత్సవములకు మహారాజాహూతులగుమావిశ్వామిత్రగురువుగారితో నేనిటకువచ్చినప్పుడునిన్నుఁగలసితిని.

శంక—ఎన్ని వత్సరములైనదో — ఇరువది వత్సరములై యుండునా?

నారా—అబ్బే! పదుమూఁడు వెడలి పదునాలుగు జరుగుచున్నదో—పదునాలుగు వెడలి పదునయిదు జరుగుచున్నదో?

శంక—ఇంతే—కాలము నాచదువువలె నింతమెల్లఁగ నడచుచున్నదే.

నా రా —

గీ. బాలుకంటెఁ గాలంబుతాఁ ♦ బేలువలెను
బ్రాఁకు ఘనతయందలి యాస ♦ బాలుఁడుంట;
వృద్ధుకంటెఁ గాలంబు వ ♦ ర్వెత్తు లేఁడి
కీర్తిఁ జావునందలి భీతి ♦ వృద్ధుఁడుంట.

శంక — నీవనుమాటకొంత నిజములాగునే యున్నది. మా గురువుగారయిన వసిష్ఠుని రాముఁడు జన్మించి యెంతకాల మయినదని యడుగ "నేనీ! మొన్న మొన్ననే కాదఁటరా!" యని యాతఁడనెను.

నా రా — కాని యప్పటియుత్సవములు బహుదివ్యముగ జరిగినవి.

శంక — దైవవశముచే రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల జన్మోత్సవము లొక్క సమయముననే వచ్చినవి కావున నంత వేడుకగ జరిగెను. వేనిమట్టునకది వేఱుగ జరిగియుండునెడల నీవేడుక జరిగియుండునా?

నా రా — వారిలో భరతలక్ష్మణులిద్దఱు కవలలా!

శంక — తెలివితేటలలో మనవిద్దఱము కవలలవలెనున్నాము. లక్ష్మణశత్రుఘ్నులిద్దఱు సుమిత్రాపుత్త్రులు — కవలలు. కైకేయీపుత్త్రుఁడు భరతుఁడు.

నా రా — అలాగా! ఆదినములలో మీగురువుగారి యొద్ద నేదియో చదువుచుంటివి కాదా?

శంక — ఇప్పటికి నక్కడనే సరిగ నదియే నేర్చుచున్నాను.

నా రా — అంతవిసుఁగుదలతోఁ జెప్పెదవేమి? చదువువచ్చుచుంటలేదా?

శంక — ఉపనయనములగువెంటనే రాజపుత్త్రులను నల్వురను

మాగురువుగారికి విద్యాభ్యసనార్థమై రాజుగారొప్పగించిరి. అప్పటికి నేనొక యర్ధపురుష్కారమునుండి జందెమువడితాడైది పుస్తకములు మోయుచున్నాను. వారు నాక్రింది తరగతిలో నొకవారముండిరి. తరువాత నొక మధ్యాహ్నము సహపాఠకులుగనుండిరి. ఇప్పటికు నాకు గురువులుగ నుండిరి. వారికి నాలుగు వేదములువచ్చినవి. ధనుర్వేదమువచ్చినది. ఉపనిషద్విద్యవచ్చినది. వేయేల ? అఱువదినాలుగువిద్యలును వచ్చినవి.

నారా—నీకేమివచ్చినవి?

శంక—నెత్తికిఁ జేతులు—కంటికి నీళ్ళు—ఒడలికిఁ జేపదెబ్బలు దట్టులు.

నారా—రాకపోయినప్పుడింతకాలము కష్టపడి చదువనేల?

శంక—వచ్చుచున్నదికావుననే చదువుచుంటిని.

నారా—వచ్చుచున్న దేమి?

శంక—కోటలో సంభావన—ఊరిలో దొడ్డిదక్షిణ.

నారా—"నీకుఁ జదువు రాదు—నీవుపో"యనిగురువుగారెప్పుడును నిన్ననలేదా?

శంక—అనేకపర్యాయములు.

నారా—అట్లయిన నాయన నిన్నేల వదలుకొనలేదు?

శంక—విస్తళ్లుకుట్టుటలోను నీవు గోకుటలోను విశేషవిద్యాంసుఁడ నగుటచే విడువలేకుండ నున్నారుకాఁబోలు. కాని యిప్పు డేమియు నుత్సవములు లేవుకదా! మాగురువుగారేలవచ్చిరి?

నారా—అదినాకెట్లు తెలియఁగలదు?

శంక—పోనీ—నీవిట్లు వీథివెంట నేలతిరుగుచున్నావో యది యైనను దెలియునా?

నారా—మాగురువుగారు రాజుగారినిఁజూడఁ గోటలోనికేగిరి, నాకేమియుఁ బనిలేక తిరుగుచున్నాను.

శంక—మాగురువుగారీదినమునఁ గోటలోనికి వెళ్ళరని నేననుకొందును.

నారా—ఏల ?

శంక—వారికి వీరికినష్టమచంద్రుఁడు, నైధనతారకాదా ?

నారా—ఐననేమి ?

శంక—ఏమియు లేదు. నడువుఁడు.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.





## తృతీయాంకము.

ప్రదేశము—రాజసభ.

ప్రవేశము—దశరథుఁడు, విశ్వామిత్రుఁడు.

విశ్వా—అట్టులాడుటన్యాయమా ?

దశ—కాకేమి ? దయయున్నవారము నయెడల నింతకాలము నకు దయచేయుదురా ?

గీ. కృపగలయెడకుఁ గాళ్ళు • కేళ్ళుదాఁటు
కన్నులుఱ్ఱూటలూరుచు • గంతులిడును
ధరణికలరునాకర్షణ • ధర్మమకంటె
దయకుఁగల దెక్కువగుఁ గాదె • తాపసేంద్ర !

గీ. కాలమునుబట్టి యవకాశ • కలనఁబట్టి
యితరకర్షణ శక్తులౌ • నెగుడుదిగుడు
దయయె సర్వదా తదబాధి • తంబటంద్రు
దయయొనరులోని దైవత • త్వంబుగాదె !

విశ్వా—(నవ్వుచు) సమీచీనముగఁ బలికితివి. సంతోషించి తిని. నీవుగూడ నాయెడల దయగలవాఁడవగుటచే నీవుచేసెదవూ తత్త్వోపన్యాసార్థము నీకుఁగూడ వర్తింపవచ్చునేమో !

దశ—(నవ్వుచు) మహర్షిచంద్రమా ! మీకు నాయెడలఁగలి

గినదిదయ—నాకు మీయెడఁ గలయది భక్తి. అందుచేత—

(సందేహించును.)

విశ్వా—(నవ్వుచు) నీయుత్తరము నీకేసంతుష్టికరముగ లేనట్లు కనఁబడుచున్నదేమి?

గీ. ఈఁతవాఁడైన నెఱ్ఱైన ♦ నీఁతగాఁడె?
చూపుకిందైన మీఁదైనఁ ♦ జూపుగాఁడె?
కొండ నెక్కుటనైన దిఁ ♦ గుటనునైనఁ
గమనకలనా ప్రసక్తి, యొ ♦ క్కటియె కాదె?

గీ. శివునిబూజించు పూలకుఁ ♦ జెలువసిగను
ముడుచుపూలకు భేదంబు ♦ నుడువనగునె?
ఘనులయందలి యనురాగ ♦ కలనభక్తి;
యదియె యితరులపైఁ గల్గ ♦ నగును దయఁగ.

గీ. క్రిందిమీఁది పోకడలను ♦ జెందియుంట
బట్టి రాగము భేదత ♦ త్త్వంబుఁగనునె?
యూపగానీరపూరవే ♦ గాధికతకు
దానిలో మాఱువడికి భే ♦ దంబు గలదె?

దశ—(నవ్వుచు) మానినత్తమా! అందువలన నేనే మిము దరిసించుటకు రావలసియుండెను, క్షమింపుఁడు.

విశ్వా—అట్లు కాదు.

గీ. కృతనమస్కృతియౌనప్పు ♦ డీకరంబు
దీనినైనను నిదిదీని ♦ నైనఁగలియ
వచ్చు; వర్షోదయమున, ♦ నబ్దంబులందు
జానిని దీనిసదిచేరఁ ♦ దగునుమింట.

దశ — మహాత్మా! యథార్థముగ నేనేవచ్చి మిమ్ము జేరవలసియుండెను. కాని — ఒక్కయంశము తమతో మనవి చేసికొనక తప్పదు. నిజము మనవిచేసెదను.

సీ. శ్రీరఘూద్వహుఁడి యవేళ • సీఁది తొఁడలు
కనులకఱవుదీర నతఁడు • గాంచుటందు
వీనులలరఁగఁ బలుకులు • వినుటయందు
నునుబులకలూరఁ దొడఁ జేర్చి • కొనుటయందుఁ
దనివిదీఱఁగఁదలమూర్చు • కొనుటయందుఁ
గొరింజవ్వులు దేర ముద్దిడు • కొనుటయందు
మురువుమురువుగఁ జెక్కిలి • పుణుకుటందుఁ
దనువు హాయిగఁ గౌఁగిలి • కొనుటయందు
ఒక నిముసమాతనిని గాన • కుండ నపుడు
రామ! రఘువీర! రాఘవా! • రామచంద్ర!
యనుచు నోరారఁగాఁ బిల్చు • కొనుటయందు
నటునిటును నాతనివెదకు • లాడుటందు
తెరపి లేదు, తీఱిక లేదు; • విరతి లేదు;
ఆప్పుదల లేదు; తుద లేదు • హద్దు లేదు;
అలుపు లేదు; సొలపు లేదు; • నిలుపు లేదు.
చాలు చాలులే; దీఁని సరి • సరియు లేదు
సర్వరాజ్యతంత్రంబులు • చప్పఁబడియెఁ:
గొఱకొఱనుచు సుమంత్రుండు • గొణఁగుకొనియె
వశిష్ఠ తంత్రంబులును జల్లఁ • బడియె; కాని

విభుని యూరుపు కానంత ♦ వెచ్చఁబడితొ.
ఇన్నియేల? రామునిగాంచి ♦ యింతగాఁగఁ
బ్రాఁకులాడెడు నేనెట్లు ♦ రామువిడిచి
దివికిఁ బోదునో యనుచు సం ♦ దియముదోఁచు
నెవరు లేరుకావున నంటి ♦ నిట్లుమీకు.

కన్నురాముని మొగముదాఁట లేకుంటచేఁ గాలుగుమ్మము దాఁటలేదయ్యెను. క్షమింపుఁడు.

విశ్వా—(అదరిపడి—వెంటనేనిమ్మళపడి) రాజా! మహాదృష్టవంతుఁడవు.

గీ. పూర్ణవిజ్ఞానమే తప ♦ మునకు ఫలము
విద్యకు ఫలంబు వినయంబు ♦ వితరణంబు
సిరికిఫలము; తేజోరూప ♦ గురుగుణాఢ్య
సుతపరిష్వంగ సుఖమె సం ♦ సృతికిఫలము.

దశ—అందఱు సామాన్యముగఁ బుత్త్రులఁ గాంతురు. ఈ రాముఁడు నావయః కాలములోనే పుట్టియుండినయెడల నాకింత వెఱ్ఱియుండదేమో?

గీ. యువకుఁ డబలాబలిష్ఠహస్త ♦ నోపధాన
మున శిరముఁ జేర్చి మోదాబ్ధి ♦ మునుకలిడును
జ్యేష్ఠపుత్త్రాంకవిన్యస్త ♦ శీర్షుఁడగుచుఁ
బోవలయు వేగనని చీకు ♦ మ్రొక్కుకొనును
లీలకొఱకుఁ జేకట్టియు ♦ వాలికగును;
సద్ది లేకుండినను వృద్ధుఁ ♦ డపనిఁబడును.

యువకుచెవులకు గానమం • త్రోద్భవుండు ;
ముక్కుటూపిరియగువాఁడు • ముదుసలికిని.

విశ్వా—(తనలో) ఇతఁడు శ్రీరామచంద్రవినిక్షిప్తప్రాణుఁడయియున్నాఁడు. ఎంతసేపు తదనురాగాభివర్ణనమే చేయుచున్నాఁడు. ఇతని మఱియొక మాటలదారిని బెట్టుట యేకష్టముగనున్నది. (ప్రకాశముగా) రాజేంద్రా! సుతు లందఱకు సుధాసన్నిభులే. అందులో నీకు వార్ధకమునఁ గలుగక కలుగక సంతతిగలుగుటచే నీ కట్లున్నది. అది యాశ్చర్యముకాదు. అదిగాక-శ్రీరామమూర్తి సంగపరిత్యాగులే వాంఛించునంతటి కళ్యాణగుణ సమంజసుఁడగుటచేఁ గన్నవాఁడవగు నీకట్లుంట మిక్కిలి సహజమే! నీవు నాయాశ్రమమునకు రాకుండుటకు రామప్రేమయే కారణమని చెప్పితివి. నేనయినఁ దఱచుగవచ్చి నిన్నుఁ జూడవలసినదే కాని—

గీ. ప్రభుఁడు తనయెడ దయగల • వాఁడటంచు
బడిబడిగ నాతనిని జేర • వలనుపడదు ;
ప్రక్కఁగూర్చుండు మన్నను • బ్రభుని కెదుట
వాసియగుదూరమున నిల్వఁ • బడఁగవలయు
ఎదుటఁ బడనిచ్చెఁ జాలు ; నింకేమియనుము
ముసుకుదుడుకొన నెల్లవ • స్తులను ముక్కు
దూర్చి, విభుకర్ణముసమూతిఁ • జేర్చి, మిగుల
దడబడలుసేయు నసుల పో • కడయె తుదకు
ఉర్విభుచిత్త మొక్కలా • గుండె ; దెప్పు
డానికి మనోవ్యథలు కోటు • లైనసుండు ;

యీసంగతి పరిపాలకుని చెవిని వయివఁబోయిన నాతఁడేమి చిన్నబుచ్చుకొనునోయని — చెప్పుకొనుటకు మాకుఁ బ్రభునికంటె భూలోకగతి మరియెవ్వరు లేకుండుటఁబట్టి — "చెప్పుదునా ? మానుదునా ? ఆతనికిబ్బంది కలుగఁజేయుదునా ? నేనే యీబాధ పడుదునా ? " యని నాలోనేను ద్రొక్కులాడులు పడుచుఁబూర్వపక్ష రాద్ధాంతము లొనర్చుకొనుచు ముందునకు వెనుకకూగులాడుచుఁ దుదకుఁ జెప్పకుండినయెడల లోకులు నన్నే దూషింతు రేమోయని — సంశయించి విధిలేక —

దశ — మునిచంద్రమా ! నీకంతసందేహమేల? త్రొక్కులాటలేల ? ఎంతమాట ?

విశ్వా — రాజేంద్రా ! "దేహి" యనుటకంటె హైన్యమున్నదా ? అంతకంటెఁ గష్టమున్నదా ? అంతకంటె మహాపదయున్నదా ? అంతకంటె నోరురానిమాట మఱియొకటియున్నదా ? దేహి మానప్రాణముల నంతలో హరింపఁగల రెండక్షరములకూర్పు మఱి యేదయిననున్నదా ? దేహి యనుటకంటె దేహత్యాగము మంచిదికాదా ? నేనేమి యధముఁడనా ? నీచుఁడనా ? తపస్సామర్థ్యముచేనిప్పుడు బ్రహ్మర్షినయినను వెనుక రాజేంద్రుఁడను గానా ? రాష్ట్రపరిపాలనము నిరంకుశముగ నొనర్చినవాఁడనుగానా ? సకల రాజభోగముల ననుభవించినవాఁడనుగానా ? విశేషవితరణ విద్యాశీలుఁడనయి వెలసినవాఁడనుగానా ? నేను — అట్టినేను "తీసికో" యనిననోటితో "దేహి" యనఁగలనా ? "ఇదిగో" యనిన మొగముతో "నిమ్ము" నఁగలనా ? ఇచ్చినచేతితో పుచ్చుకొనఁగలనా ? సందేహమేల ? త్రొక్కులాటమేల ? " యని యందువేల ?

దశ — తాపసేంద్రా! "దేహి" యనుట యెందులకండీ? మీరు దేహియనువారు మీరు కారు; వారు నాయాశ్రితులు. మీరాజ్ఞాపించు వారు; నేను మీయాజ్ఞను దలఁదాల్చి మాఱుమాటాడక నిర్వహించు సేవకుఁడను.

విశ్వా — నాయనా! శబ్దములు మృదువులైన నర్థములు మృదువులగునా? శుంఠ దొడ్డిసంభావనకుఁ బండితుని పారితోషికమునకుఁ బరిధానుని బహూకృతికి శబ్దభేదమే కాని యంతకంటె నేమున్నది? పరమార్థమున నంతయు ముష్టియే కదా? తపస్సంపన్నుఁడను గాన నన్నుఁ గూర్చి "యాజ్ఞ" యని గొప్పమాట నంటివి. బాగుపడఁదలఁచిన ప్రభుఁడవు గావున నిన్నుఁ గూర్చి సేవకుఁడ ననుకొంటివి. అంతే కాని యథార్థముగ నీవు ప్రభుఁడవు — నే నర్థిని. దేహి యనుటకే తెగించి తెగించి వచ్చితిని. కాని, నోరు వచ్చుట లేదు. చేయి సాగుట లేదు. మనస్సు వంగుట లేదు.

దశ — (చేతులు జోడించుకొని తొందరతో) అయ్యయ్యో! అట్లనుచున్నారేమి? అట్లనుచున్నారేమి?

విశ్వా — అడుగుటకే వచ్చితిని. యాచించుటకే వచ్చితిని. కాని నీసంభాషణవైఖరిఁ జూడ నామనస్సు విముఖమగుచున్నది. అడుగుటకుఁ బెదవులు విడకున్నవి. పడనీ! కష్టములఁ బడనీ! ఎన్ని కష్టములనయినఁ బడనీ! తాటక యజ్ఞశాల దగ్ధము సేయనీ! మారీచుఁడు రక్తమాంస వర్షములు హోమకుండమునఁ గురియనీ! సుబాహుఁ డుద్బాహుఁడై నా మొగమున నిప్పులు కుప్పలు వోయనీ! తలపెట్టిన యజ్ఞములు ధ్వంసములు కానీ! దీక్షలు మంటఁగలియనీ! ఏమి రానీ! ఏమి రాఁబోవనీ! దేహి యనిన పిమ్మట లేదనియందువేమో? రాజేంద్రా! నేనుఁ బోయివచ్చెదను. (లేచుచున్నాఁడు)

దశ — (ఆతనిఁ గౌఁగిలించి చేతులు పట్టుకొని) లేదనుటయే — లేదనుటయే — ఎప్పుడైన నట్లంటినా? సందేహింపవలదు. వలదు. వలదు. వెంటనే మీయభిసంధి యేదియో యాజ్ఞాపింపుఁడు.

విశ్వా — లేదనవచ్చును. తప్పేమియు లేదు. నాసొమ్ము నీయొద్ద నేమిదాఁచఁ బెట్టితినా? రాజధర్మానుసారముగ నొకప్పుడు 'ఊఁ' యనవచ్చును. మఱియొకప్పుడు 'ఊహూఁ(హూఁ)' యనవచ్చును. ఇట్టిది రాజవయిన నీయొక్కనికే తెలుసుననుకొంటివా? రాజనీతి రహస్యక్రమము నేనుగూడ రవ్వంత నెఱిఁగినదే కాదా?

దశ — మీరు ముందు కూర్చుండుఁడు. (విశ్వామిత్రుని గూర్చుండఁబెట్టి) వినుండు —

గీ. స్వామి మా పూర్వుఁడౌ హరి • శ్చంద్రుఁ డఖిల
ధరణి ధారవోసినటులే • ధరణినంత
మీ కొసంగుటే కాక నా • మేని జీవ
ములను గోరిన నిచ్చెద • ముదముతోడ.

విశ్వా — (చిఱునవ్వుతో) "ముదముతోడ" ననికూడ ననుచున్నావా? అట్లుకూడఁ జరుపుకొనఁగలవా?

దశ — (నవ్వుచు) హరిశ్చంద్రుని సత్యహరిశ్చంద్రునిఁ జేసినవారెవ్వరు? 'జరుపుకొనఁగలవా?' యని నన్నడిగెదరేల? జరిపించుకొనుభారము మీదే.

విశ్వా — (చిఱునవ్వుతో) అంతటనే యహంకృతిని వదలుచుంటివేల?

దశ — (చిఱునవ్వుతో) మీయాధిక్యము నభినుతించుచున్నాను.

విశ్వా—సరే! నీవు కూర్చుండుము.

దశ—(కూర్చుచుండి) సుబాహు మారీచులంత ప్రబలులై, దుర్మదాతిరేకులై మిమ్ము బాధించుచున్నారా!

విశ్వా—(సాగుడుగ) బాధించుచునే యున్నారు.

దశ—ఇంత కాలము నేఁడు నేమిచేసితిరి?

విశ్వా—వారిని మఱియొక మహానుభావునిచేఁ జంపింపఁ దలఁచి యిన్నాళ్లు సహించియుండవలసివచ్చినది.

దశ—(తొందరతో) ఆమహానుభావుఁ డెవ్వఁడు?

విశ్వా—మఱెవ్వరున్నారు?—రాముఁడు.

దశ—(అసూయతో) జామదగ్న్యరాముఁడా?

విశ్వా—ఆతనికో యీ కీర్తి కేలవచ్చును! దాశరథిరాముఁడే.

దశ—(అదరిపడి) ఆఁ! ఆఁ! ఏమది?

విశ్వా—మన రాముఁడే. సర్వజన నయనాభిరాముఁడయిన మన రాముఁడే. సుగుణసూనారాముఁడయిన మన రాముఁడే.

దశ—(సందేహించుచు) ఊఁ! ఊఁ!

విశ్వా—మారీచ సుబాహు వధార్థమై—మదీయ సవనరక్షణార్థమై—మన రాముని నాతో నిపుడు పంపుము. ఇదియే నాకోరిక. ఇందుకొఱకే వచ్చితిని.

దశ—(గడగడలాడుచు) అలా—స—రే—కాని—

విశ్వా—ఇఁకఁ గానియేల? ఆతనిఁ బంపుము.

దశ—(గద్గదికతో) అ అ అటులే—మీ—సె—ల వగు నెడలఁ దప్పునా?

విశ్వా—నా సెలవు ప్రమాణమైనా? నీవాగ్దానముకూడ నయి నదికాదా?

దశ — ఆలాగే — ఊఁ — అటులే — ఊఁ — మీరాయిష్టపటు లుండఁ దప్పునా? మాటవరుస కడుగుచుంటిని మహాత్మా!

విశ్వా — రాజేంద్రా! ఏల?

దశ — మన రాముఁడే — ఏది? మన చిన్న రాముఁడే — నుపయింత రాముఁడే — మాంసలమదమత్త మహాసురమారణ మొనర్చుట — ఆఁ! పసివాఁడు! ఏది? కుఱ్ఱవాఁడు — బాలుఁడు —

విశ్వా —

గీ. అంతనగముకంటె ♦ నింతహీరము మేలు
ఘనమనంటి పూవు ♦ కంటె జాజి;
బూరుగునకుఁ దులసి ♦ మొక్క పూజ్యంబౌను
చిన్నపెద్దచింతఁ ♦ జేయుదేల?

దశ — విలువలో, గౌరవములో, బూజ్యతలో, ఘనమే కావచ్చును. కాని, మోసుకొనుటకు దేహదార్ఢ్యమేది? బూరుగొక్కటి విఱుచుకొనిపడినయెడల నెంత తులసివనము దగ్ధమైపోవును?

విశ్వా — రాజేంద్రా! అట్లనుదువేల?

గీ. పూజ్యతాపేక్షతాదిసం ♦ పూర్తిగల్గు
చిన్నయెడనైన సత్వంబు ♦ జేరుఁ బ్రాయి
కముఁగ, నలుసంత యంగార ♦ కణము దండ
కామహాకుజరాజము ♦ గాల్పలేదె?

కన్నతండ్రి వగుటచే రాముని మహాత్త్వముఁ గనక యట్లనుచుంటివి. సందేహింపకుము.

దశ — క్షమింపుఁడు. కన్నతండ్రి నగుటచేతనే యాతనిశక్తి యుక్తులు బాగుగ నెఱుఁగుదునని నమ్ముకొనుచున్నాను. ఆశీర్వదింపవలసిన మీరు చిన్నబిడ్డను బట్టుకొని మహాత్తుమహాత్త నెదరేల?

# తృతీయాంకము.

సీ. పొడుగువాఁడే కాని ♦ పొడుగున కనువైన
యొడలింకఁ జేయని ♦ బుడుతవాఁడు ;
ఘనముగా నిడుదగా ♦ కనుల వాఁడే కాని
బెదరింకఁ దీరని ♦ పిన్నవాఁడు
కళుకుగా గనుచె ♦ క్కిళులవాఁడే కాని
పాలింకఁ జిలికెడు ♦ పాపవాఁడు
పొడవుగా వంకగా ♦ బొమలవాఁడే కాని
చిట్టించుటిఁక రాని ♦ చిన్నవాఁడు.

గీ. చిన్నసవ్వుల చెన్నుల ♦ వన్నెలాఁడె
కాని యట్టహాసము సేయ ♦ లేనిచిఱుత
సొగసు నెఱె వెంట్రుకల నిగ ♦ న్నిగలవాఁడె
కాని పిల్లజుట్టున నింకఁ ♦ గ్రాలువాఁడు.

గీ. వెనుక సావిత్రి ముందు నై ♦ పునను భటుఁడు
నెనసియుండని యెడ నడు ♦ గిడనివాఁడు
తల్లి యొకవంక నొకవంక ♦ దండ్రి చేతఁ
బాముపకుండిన యెడ నిద్ర ♦ పోనివాఁడు.

గీ. గోటిబిళ్ళ యేసూటిగ ♦ గొట్టఁజాల
నట్టి యతఁ డమ్ముల్రనుజిమ్ము ♦ గొట్టునెట్లు ?
కుండబంతియే గుఱిపెట్టి ♦ కొట్టలేని
బొట్టెఁడసురవీరుల తలల్ ♦ గొట్టునెట్లు.

సీ. క్రుద్ధయై తాటక ♦ గ్రుద్దెను గ్రుద్దులు
కూర్మి నమ్మ్రయొసంగు ♦ కుసుములగునె ?

అలసుబాహుఁడు వేయు ♦ బలుచ పేలంబులా
మురిపించి నేఁ బెట్టు ♦ ముద్దులగునె ?
మారీచ ఘోరాగ్ని ♦ నారాచ వారంబు
మామ యిచ్చిన రత్న ♦ దామమగునె ?
రణదేవత యొసంగు ♦ రక్తార్ద్రవసనంబు
తాత యిచ్చిన పట్టు ♦ తాపితగునె ?
బాలుఁ డెక్కడ ? యంజన ♦ శైలకాల
కఠిన దంష్ట్రాకరాళ వి ♦ గ్రహ వినిర్భ
రాక్షయ బలాఢ్య రాక్షసా ♦ ధ్యక్షు లేడ ?
పూల వ్రేటులఁ బగులునే ♦ పులులతలలు.

మహాత్మా ! అట్లు యోచించుచున్నా రేమి ?

విశ్వా — ఇఁక ముం దేమి చేయవలయునో యని —

దశ — (గుండె కొట్టుకొని)

గీ. ఈతఁ డెవఁడు ? దాసుఁడు మహా ♦ హీనదేవ
దానవానూనజన్య సం ♦ తానమునను
కసికు, కఱకు, కంగుల కాఁగి ♦ గడినిదీఱు
గండ్రఁడిదె వచ్చుచున్నాఁడు ♦ గానఁ బదుఁడు.

(నమస్కరించును.)

గీ. తాటకామహామాయోద్ధ ♦ నాటికకును
భరతవాక్యముఁ జెప్పించి ♦ ప్రబలబాహు
బలసుబాహు మారీచాది ♦ ఖలుల కెల్ల
దర్భశయ్యల నిచ్చి ప ♦ త్త్రము బిరాన.

(లేచును.)

